విడిప్రతిక ౧ అణా

# గోలకొండపత్రిక


ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

సం॥ చందా రూ. ౬ — నవంబరు ౨ వ తేది ౧౯౩౬ సోమవారము — అర్ధ సం॥చందా రూ ౩

సంపుటము ౧౧ { త్రూపుబజారు, హైదరాబాదు - దక్కన్. — శా. శ. ౧౮౫౮ = శ్రీధాతసం॥ ఆశ్వయుజ బ॥ ౪ సోమవారము. = ౨౮ ఆజూర్ ౧౩౪౬ ఫ. } సంచిక ౫౦

## రాబోవు ఆంధ్రమహాసభ దాని ప్రాముఖ్యత

(ఒక ప్రబోధనశాలి)

[ఒక ప్రబోధనశాలి]

౧౨ బహమనునుండి మూడు దినములవరకు మహబూబునగరము జిల్లాలోని షాదునగరమున జరుగబోవుచున్న ఐదవ నిజాంరాష్ట్రాంధ్ర మహాసభ పలుకారణములవలన ప్రాధాన్యముగలదిగానున్నది. ఈవిషయమునగానవచ్చు ప్రత్యేకతల నీచిన్నివ్యాసములో వివరింప యత్నించుచున్నాను.

### సంస్కరింపబడిన మొదటి మహాసభ విషయనిర్ణయ సభ

ఇదివరకుజరిగిన నాల్గుమహాసభలకు నిర్ణీతముగు నియమావళి [Constitution] లేకయుండెను. కొన్నిరివాజులలోనుండు సాధారణ సంప్రదాయములను ఆచారములను దృష్టిలోనుంచి నడుపబడుచుండెను. ఈసారి అట్లుకాక నియమావళి ఏర్పడినది. అది సిరిసిల్ల మహాసభయొక్క తుదిదినమున తుదిసమావేశమువలన నంగీకరింపబడినది. కనుక సర్వవిషయములనునియమములననుసరించి జరుపబడును విషయనిర్ణయసభ మునుపటివలె కొందరిచే తోడువలెగాక సభ్యులసంఖ్య ౬౪ అని నియమావళిలోని [౧౩] నియమమువలన స్థిరపడినది. ఆలోచనీయవిషయములలోను క్రమత ఏర్పడినది. కనుక సభాచర్యలు మునుపటికంటెను ఎక్కువగా క్రమబద్ధమై యుండగలవు.

### ప్రతినిధులు

ప్రతినిధులటికెట్లు ఇకముందు స్థాయిసంఘమువలన జారీచేయబడును. ప్రతినిధి దరఖాస్తు ఫారముపైన దస్కతుచేసియిచ్చి రసీదో లేక టికటో పొందును. ఈద్రవ్యము నియమావళి ననుసరించి పూర్తిగా స్థాయిసంఘమునకు చెందును. ప్రతినిధులరిజిస్టరు వివరములతో ఉండగలదు. మహాసభాచర్యలలో ఏజిల్లావారు ఎందరెందరుపాల్గొనిరో ఈమహాసభానివేదికలలో తెలియగలదు. పూర్వము ప్రతినిధుల సంఖ్య ఇంతయని స్పష్టముగా తెలియు మార్గమే లేకుండెను. అంచనా మాత్రము దొరకుచుండెను. ప్రతినిధిరుసుము లతీసికొని టికెట్లు జారీచేయు పద్ధతి ఇప్పటినుండియే ఆరంభమగుచున్నది. కనుక తీరాసమయమునకు పెండాలవద్ద ఇబ్బంది కలుగకుండ ఏర్పాటులు చేయబడినవి. ప్రతినిధి మహాసభ నియమావళిని అంగీకరించినట్లు ఫారముపైన దస్కతుపెట్టును. కనుక మహాసభాయుద్దేశములకు వ్యతిరేకముగా వాదములు జరుగు నవకాశముండదు.

### అధ్యక్షుడు:

ఈసారి అధ్యక్షునినియామకము [౪]జిల్లా కమిటీలయొక్కయు [౧] ఆహ్వానసంఘముయొక్కయు [౧]స్థాయిసంఘముయొక్కయు అనగా మొత్తము ౬ సంఘముల అంగీకారముతో జరిగినది. మునుపట్లుండలేదు, ఆహ్వాన సంఘము,స్థాయిసంఘము రెండునుకూడ బలుపుకానియేచేయుచుండిరి. కనుక ఇప్పటిఅధ్యక్షుడు మునుపటికంటె విశాలతరమగు ప్రాతినిధ్యము కలవాడుగానుండును. ఇట్టివే నియమావళినిబట్టి ఎన్నియోమార్పులుకలిగినవి. కనుక క్రమవిధానము గతనాల్గుసభలకంటె ఈసభ ఎక్కువ ఆకర్షకముగను నియమబద్ధముగను ఉండగలదు.

### శ్రీయుత వేంకటరంగారెడ్డిగారు:

అధ్యక్షులుగా ఎన్నుకొనబడిన శ్రీయుత రెడ్డిగారు ప్రత్యేకగౌరవముకలవారగుట సంభవించినది. అనగా వీరు విద్యాధికులు, ఆంధ్రోద్యమస్థాపకులలోనివారును,న్యాయశాస్త్రవేత్తలుమాత్రమేకాక, శాసననిర్మాణ సభాసదులు కూడనగుట విశేషము ఈయుదిగౌరవము మేమెరింగినంతవరకు గత౨౫సంవత్సర కాలములో ఏఆంధ్రన్యాయవాదియు. న్యాయవాదిగా పొందియుండలేదు. కనుక ఇదిమనయదృష్టము. అంతేకాని. వీరు "రైతుబిడ్డ"అనదగినవారు మన రాష్ట్రమునకు వెన్నెముకఅనదగిన వ్యవసాయకులతరగతికిచెందినవారు. గ్రామజీవనము, ప్రజలకష్టనిష్ఠురములను బాగుగాదెలిసినవారు,కనుక నేటికాలమున రైతులకుగల యిబ్బందులను బాగుగా గ్రహించగలరు.

### సభాధ్యక్షత, శాసనసభాసభ్యత్వము

ఈరెండుపదవులను ఒకవ్యక్తికే ఒకసంవత్సరమునకు లభించుటవలన, ప్రజాభిప్రాయము ప్రభుత్వమందిరములోనికి బాగుగా ప్రవేశించగలదు, ప్రజలస్థితుల బాగుదెలిసికొనిన అధ్యక్షుడు శాసనసభలో వారికష్టముల దొలగించుటకై చిత్తు శాసనముల ప్రవేశపెట్టగలిగియుండుట గొప్పలాభము. రైతులఋణబాధ, సహకారసంఘముల లోటుపాటులు, హరిజనులఇబ్బందులు, సాంఘికములగు దౌర్బల్యములు. జాగీరుప్రజలకష్టములు మున్నగునవి శాసనసభ అమూలమున నివారింపబడుటకు ఈ మహాసభ చాలఅవకాశముల కలిగించగలదు. కనుకఈవిషయములల్లోగలలోపములను నిజాంరాష్ట్రనివాసులగు ఆంధ్రులందరును ఈసభకువచ్చి, ప్రతినిధులై బయటపెట్టవచ్చును. ఈవిషయమున ఇంతటి మంచిఅవకాశము ఇదివరకు ఎప్పుడును ప్రజలకు లభించియుండలేదు,

### నగర సామీప్యము

మహాసభాస్థలమగు షాదునగరము, హైదరాబాదునకు ౩౨మైళ్లదూరముననున్నది. నగరమునుండి మహబూబునగరమునకు బోవు రైలు మార్గమునగలదు. మోటార్లమీద గంటప్రయాణమువచ్చును. సిరిసిల్లవంటి దూరప్రదేశమునకే వందలకొలదిప్రతినిధులు ప్రతినిధురాండ్రు నగరము, సికింద్రాబాదులనుండి. బస్సులమీద, మోటారుబండ్లమీద, సైకిళ్లమీద వచ్చియుండిరి. అట్టిస్థితిలో ఆదూరములో దాదాపు నాల్గవభాగము దూరమునమున్న షాదునగరమునకు నాగరికులు అసంఖ్యాకులుగవచ్చి దానిజయమునకు కారకులగుదురనుట నిస్సంశయము ఈకారణమువలన మహాసభాదినములలో విశ్రాంతివేళల వినోదముల కవకాశము చాలకలదు.

### వ్యాయామములు, పోటీలు

నిరుడు సిరిసిల్లలో ప్రారంభింపబడిన వ్యాయామములు, పోటీలుమున్నగునవి ఈసంవత్సరము అంతకంటె గొప్పగాజరుగునని తెలియుచున్నది (శ్రీయుత రావి నారాయణరెడ్డి గారు నిజాంరాష్ట్ర హరిజనసేవక సంఘాధ్యక్షుండు) ఆహ్వానసంఘమువారితో నీవిషయమునచాలోచించుచున్నారు. నిర్ణయములుత్వరలో జరుగనున్నవి

### షాదునగరము

ఇదిరైలుస్టేషను, ఊరికినిదీనికినిమధ్య ౩, ౪ ఫర్లాంగుల అంతరముకలదు. ఇచ్చట పురాతన మందిరము విశాలమైనదికలదు ఎందరికైననుతగు ఆశ్రయముదొరకవీలుకలదు. ఊరిపేరుఫర్రుఖునగరము. జానంపేటఅనునది నామాంతరము ప్రేషప్రదేశము వర్తకప్రాముఖ్యముగలది విశేషమేమనగా. ఈస్థలము మనరాష్ట్రపు ప్రధాన మంత్రులగు మహారాజా సర్ కృష్ణప్రసాదు బహదూరుగారి ఎస్టేటులోనిది ఇదిఎస్టేటులోని తాలూకాస్థలము ఎస్టేటులో ఆంధ్రమహాసభ సమావేశమగుట ఇదిమొదటిసమయము. దీనివలన మహారాజా బహదూరుగారి కీర్తి విస్తరిల్లును.





సిరిసిల్ల మహిళాసభ స్వచ్ఛంద సేవికా దళము



గోలకొండ పత్రిక

ధాతనామ సం॥ ఆశ్వయుజ బ॥ ౪

సోమవారము

## హిందూ మహాసభలో చీలిక

హిందూ మహాసభలో ఇప్పుడేర్పడిన చీలికకు రెండు కారణములున్నవి. ఒకటి రాజకీయ సంబంధము, రెండవది సాంఘికము. రాజకీయములందు మాలవ్యాపండితుని పక్షపువారు స్వాతంత్ర్యము సంపాదించునంతవరకు కాంగ్రెసుతో కలిసి పనిచేయవలెననువారు. ఈవిధానము భాయి పరమానందు పక్షము వారికి ఎంతమాత్రము నచ్చదు. కనుకనే భాయి పరమానందుగారి స్థానమగు లాహోరులో ఈసారి సమావేశమైన హిందూ మహాసభలో పాల్గొనదలచిన పండిత మాలవ్యా పక్షీయులకు ప్రతినిధుల టిక్కెట్లు లభించకపోయెను. రెండవ కారణము సనాతనులకును సంస్కర్తలకును సాంఘిక విషయములో—ముఖ్యముగా అస్పృశ్యతానిర్మూలన విషయమున—గల అభిప్రాయభేదము. ఈసారి మహాసభకు అధ్యక్షతవహించిన జగద్గురు శంకరాచార్య డాక్టరు కుర్తకోటిగారు అస్పృశ్యతా నిర్మూలన విషయములో చెప్పిన కొన్ని అభిప్రాయములు సనాతనులకు ఏమాత్రము నచ్చనందున వారు మహాసభనుండి లేచిపోయి ఇంకొకమహాసభను సృష్టించెదమని బెదరించుచున్నారు. మహాసభా సమావేశమునకు ముందే సనాతనులు తమకు ఆక్షేపణీయములైన ఆ భాగములను తీసివేయవలసినదిగ కోరినప్పుడు తన అభిప్రాయములను వెల్లడించకుండ అణచివేయుటకంటె తాను మహాసభాధ్యక్షతనే వదలుకొందుననిచెప్పిన డాక్టరు కుర్తకోటిగారు అఖరుకు ఆక్షేపణీయములని సనాతనులచే ఘోషింపబడిన భాగములను వాపసు తీసికొనినారు. కాని దీనివలన మొండి సనాతనులు సంతృప్తిజెందుదురా యనునది సంశయగ్రస్తమైయున్నది. ఆ యాక్షేపణీయమైన అంశమేమో చూతము.

అస్పృశ్యులనబడు వారలు కేవరికైనను హిందూ మతములో నుండుటవల్ల హిందువులమధ్య సరియైన గౌరవము, కావలసిన హక్కులు లభించజాలవని గట్టిగా తోచినచో, వారలు అన్యమతమును దేనినైనను అశ్రయించక హిందూమతమును ద్వేషించని సిక్కు మతమును స్వీకరించవచ్చునని డాక్టరు కుర్తకోటిగారు సలహానిచ్చిరి. అస్పృశ్యులను హిందూ మతములోనుండి లేచి పొమ్మనరాదు అని సనాతనుల ఆక్షేపణ. అస్పృశ్యులనందరిని విధిగా హిందూమతమును వదలవలెనని నేనుచెప్పుటలేదు, వదలిపోనిది మంచిగతి లేదని నిర్ధారణ చేసికొన్న అస్పృశ్యులకు మాత్రమే నా సలహా వర్తించును అని కుర్తకోటిగారు సమాధానమిచ్చిరి. ఆసమాధాన మటుంచి, "అమ్మ పెట్టనుపెట్టదు, అడుక్కొతిననివ్వదు" అను రీతిలోనున్న సనాతనులు ఇట్టి యాక్షేపణ చేసిన, దాని గౌరవము అంతంతమాత్రమే. అస్పృశ్యులనబడువారలకు హిందూమతమును సుఖముగా అనుభవించుటకు గల అంతరాయములను, ఇతర సాంఘికములగు హక్కులులేకుండుట మున్నగు ఆటంకములను తొలగించుటకు సనాతనులు ఏమాత్రము సమ్మతింపరుగాని, హిందూ మతములో తమచే హీనముగ చూడబడుచు అట్లె బాధ లనుభవించుచుండవలెనేగాని లేచిపోకూడదు అని నిర్బంధించుటకు మాత్రము సర్వ సంసిద్ధులు! డాక్టరు కుర్తకోటిగారు సనాతనులకు ఈమాట అడిగియుండవలసినది.

అయినను భయములేదు. అట్టి మొండిసనాతనుల సంఖ్య అపారహిందూజనసంఖ్యలో లెక్కకురానిది. ఇప్పుడు హరిజనుల అభివృద్ధి విషయమున ఉపేక్ష వహించియున్నవారల సంఖ్యయు సంస్కర్తల సంఖ్యయు ఎక్కువ. ఇందు రెండవ శాఖవారు మొదటి తరగతివారిని సులువుగ తమపక్షమున చేర్చుకొనవచ్చును. అట్లుచేర్చుకొని, సంస్కర్తలు సనాతనుల పలుకుబడి ఏమాత్రము లేకుండజేసి, హరిజనుల నిజమైన అభివృద్ధికి తెక్కకురాదగిన కార్యములను చేయుటకు త్వరపడవలెను. ఇంతవరకును మాటలే ఎక్కువగాని పని తక్కువగా నున్నది. పని స్థిరముగను వేగముగాను జరుగుచున్నచో అంబేడ్కరుగారి ఉద్యమము పుట్టియేయుండదు.

సాంఘిక సౌఖ్యములందును, ఆర్థిక సౌఖ్యములందును తక్కిన హిందువులతో సమానస్థితియందు లేక హీనముగ చూడబడుచు అతృప్తిజెందియున్న హరిజనులు వివిధ మతస్థుల ఆకర్షణలకు సులువుగ లొంగగలరు. కొందరు నిరుద్యోగులు పొట్టబోసికొనుటకై ఈ హరిజనుల మత పరివర్తన ప్రచారమును సాధనముగ ఉపయోగించబడుచున్నారను సంగతియు, ధనాకర్షణ విశేషముగ ఎఱగా ఉపయోగించబడుచున్న దనుసంగతియు గమనించి, హరిజనులు హిందూమతమును వదలరాదని కోరువారు, ముఖ్యముగా, మొదట అక్షరాస్యులై నిరుద్యోగులుగనున్న హరిజనులు ఇట్టి మత పరివర్తన ప్రచారమునకు ఆకర్షించబడకుండ చూచుటయేగాక, హరిజనుల ఆర్థికాభివృద్ధికి మంచి ప్రణాళిక నిర్మించుకొని స్థిరమైనపనిని విశ్రాంతిలేక చేయుచుండవలెను. అట్టిపనులచే ఆర్థికాభివృద్ధిపొందు హరిజనుల సంఖ్య హెచ్చుకొలది హరిజనులకు హిందువులయందు విశ్వాసము వృద్ధిచెందగలదు. ఆర్థికాభివృద్ధి సాంఘికగౌరవమును ఎట్లైనను సంపాదించి పెట్టగలదు. తుదకు హరిజనుల అభివృద్ధి సమస్య ప్రధానముగ ఆర్థిక సమస్యయే యనుసంగతి గుర్తించబడిననే గాని ప్రయోజనము లేదు.

## ఐదవ ఆంధ్రమహాసభ,

### షాద్ నగరం. (రైల్వేస్టేషన్)

౧౨,౧౩,౧౪ బహమన్, ౧౩౪౬ ఫ. (మార్గశిరశు॥ ౭-౩-౪) తేదులలో జరుగును.

అధ్యక్షుడు:

**శ్రీయుతులు కొండా వేంకటరంగారెడ్డిగారు హైకోర్టువకీలు**

ఈ తేదులలో ఐదవ మహిళాసభకూడా జరుగును.

| | |
|---|---|
| ఆహ్వాన సంఘకార్యాలయము<br>షాద్ నగరం | వేంకట నారాయణరెడ్డి—అధ్యక్షులు,<br>బూర్గుల వెంకటేశ్వరరావు కార్యదర్శి. |

## మాకు దొరికినవి

మాసు హైదరాబాదు. నయాపుల్ వద్ద మొన్న ఒక సదాఖదునామా, ఒక మెట్రిక్ సనదు మరియు ఒక బి. ఎ. సనదు దొరికినవి. కాబట్టి ఎవరిదైన పైనుదహరించినవి పోయినయెడల ఈదిగువ అడ్రెసుకువచ్చి తమదైనటుల రుజువుచేసి తీసుకొని వెళ్లవచ్చును.

ఇట్లు

| | |
|---|---|
| హైదరాబాదు<br>౨౭-౧-౪౬ | సెక్రెటరీ ప్రభాత్ రీడింగు రూము, గౌలీగూడ హైదరాబాదు, దక్కన్ |

## న్యాయశాఖవారి ప్రొత్తగస్తీ

మన ఉన్నత న్యాయస్థానమువారు ఫౌజ్దారీ న్యాయ విచారణాధికారుల పేర ఇటీవల జారీచేసిన ఒకగస్తీ సాక్షుల సరియైన విలాసము ఉర్దూలోనేగాక ఆయా ప్రాంతపు వాడుక భాషలోగూడ నుండవలెనని విధించుచున్నది. ఇదేవిధముగ మొత్తము న్యాయవిచారణ యంతయు—అనగా సాక్ష్యము, నేరస్థుల వాఙ్మూలములు, సవాళ్లు మున్నగునవన్నియు—ఆయాప్రాంతపు భాషలో జరుగుటకు న్యాయశాఖవారు అజ్ఞనిచ్చిన ప్రజలందరును న్యాయముగుతీర్పు చేయబడినప్పుడెల్ల తాము సరియగు న్యాయము పొందుచున్నామని ఇప్పటికంటె ఎన్నియోరెట్లు దృఢవిశ్వాసము గలవారై సంతోషించుచుండగలరు. ఎంతో కాలమునుండి కోరబడుచున్న ఈ సంస్కరణము లభించుచో ప్రజలకు ఎన్నడును అనుకొనని దిక్కునుండి ధనము వచ్చిపడినట్లే.

## వైశ్యులవసతిగృహమునకు చందాలువసూలగుట

### ఆర్యవైశ్య దసరాసమావేశములో ప్రకటన.

తేలుకుంట వెంకటేశ్వరరావుగారు

ఆశ్వయుజశు॥ ౧౦ ఆదివారంనాడు "శ్రీనిజాంరాష్ట్రీ ఆర్యవైశ్య తాత్కాలికసంఘము" వారిపక్షమున ఫీలుఖానా ఆంజనేయుల దేవాలయములో సమావేశము జరుపబడెను. దాదాపు ౨౦౦ సంఖ్యలకధికముగా వైశ్యులు సభనలంకరించి యుండిరి. శ్రీయుత తేలుకుంట వేంకటేశ్వర్ రావు (వకీలు హైకోర్టు)గారిని అధ్యక్షతవహించిరి.

౧. శ్రీయుత కల్వకుంట్ల ఈశ్వరయ్యగారు దసరా [విజయదశమి]ను గురించిపుపన్యసించిరి. దసరానాడిట్టిది జరుగుట గొప్పసుదినమని చెప్పిరి.

౨. శ్రీయుత నాగోయ, వెంకటకృష్ణారావువకీలుగారు "జీవితసాఫల్యములు" గురించి ఉపన్యసించిరి.

ప్రస్తుతము నిజాంరాష్ట్రీ వైశ్యులకొరకేర్పరచు వైశ్యవసతిగృహమునకు కొంతమంది చందాదార్లేర్పడినారు. తక్కినవారలు యథాశక్తి చందాదార్లుగ నేర్పడిన, కొలదికాలములో వసతిగృహ మేర్పరచబడునని సూచించిరి. ఆటుపిమ్మట శ్రీయుత జివ్వాజి సుబ్బరాయగుప్త నిధాంతిగారు సంఘదురాచార నిర్మూలనవిషయములచేర్కొనిరి.

అధ్యక్షులవారు ఉపన్యాసకుల పుపన్యాసముల పరిశీలించుచు సభముగించిరి. ముగించుటకుపూర్వమే గమనించదగిన విషయము చెప్పిరి. తాత్కాలికముగా నేర్పడినసంఘమువారు నిరాఅందరి భృత్యులేయనియు. వారలకుమీరు తగినసహాయ్య మొనర్చుచుండిన కొలదికాలములోనే వైశ్యజాతి ఉన్నతికిరాగలదనియు చెప్పిరి.

తర్వాత దసరాసమావేశముయొక్క ఫొటో తీయబడెను. సర్కారువారు అనుమతి ఒసంగనందువల్ల మంగళవాద్యములతో ఊరేగింపు జరుపబోవ వలనుపడలేదు.

## టెన్నిసుకోర్టు ప్రారంభోత్సవము

మెహబూబ్జంగు బహద్దురుగారు జరుపుట

హైదరాబాదు; ఆజూరు ౨౪:—

ఆసిఫ్ క్లబ్బు మరియు పబ్లిక్ గార్డెను క్లబ్బులయొక్క ప్రారంభోత్సవము నిన్న సాయంత్రం ౫.౫౦ ఘంటలకు రాకుమారుడు నవాబు మెహబూబ్జంగు బహద్దురు గారు జరిపిరి వీరినిక్లబ్బు కార్యనిర్వాహకవర్గము వారు ఆహ్వానించిరి వీరు కటీరను కోశి వేంచేయగనే నవాబు నజీరయార్జంగు బహద్దురుగారు పబ్లిక్ గార్డెను క్లబ్బుగురించి క్లుప్తముగా ఉపన్యసించుచు, అటకొం[డ]ను హిందూస్థానమందే కాక విదేశములలోకూడా పేరుప్రతిష్ఠలు గాంచియున్నారనియు, రాకుమారుని యాజమాన్యమున ఇకముందు చాలా అభివృద్ధినొందగలదని నమ్ముచున్నాననియు తమ ఉపన్యాసమును ముగించిరి

తర్వాత రాకుమారుడు ప్రత్యేకరముగా పురాతన కోర్టునువదలి మంచి సౌకర్యములుగల నూతన కోర్టునం పొందగలందుకు మిక్కిలిసంతసించుచున్నాననివాక్రుచ్చి టెన్నిసు బ్యాటొకటి చేనిడికోర్టు ప్రారంభోత్సవము జరిపిరి ప్రధానామాత్యులవారును, కొత్వాలుసాహెబ్గారు మొదలగువారు కూడా సమావేశమైయుండిరి.



## ORIENTAL



## స్పెయిను ప్రధాననగరము చుట్టు విప్లవకారులతో ప్రభుత్వపు పోరాటము

స్పెయినులో అల్లరులపరిస్థితులను చూచుచుండగా అంతకంతకువిప్లవకారులే ఎక్కువబలవంతులుగనున్నట్లు కనపడుచున్నది

విప్లవకారులసేనలు స్పెయినురాజ్యప్రధాననగరమగు మాడ్రెడునువశపరచుకొనుటకై నడచుచున్నవి. అక్టోబరు ౨౦వ తేదినాటికి పైసేరియాతీరమందున్న ఫర్నాండోద్వీపమును అసేనలువశపరచుకొని అక్కడనుండు స్పెయిను ప్రభుత్వనియమితుడగు గవర్నరును వెడలగొట్టి కొందరు ఆఫ్రికాజాతీయులు చేరిన మంత్రివర్గమును స్థాపరచిరి. ఆఫ్రికాజాతివారిని మంత్రివర్గమున చేర్చుట, అబిసీనియాను వశపరచుకొనియున్న ఇటలీవారు అక్కడి ఆఫ్రికా జాతీయులనుబ్బించి వశమందుంచుకొనుటకై విప్లవకారులచే చేయించినపనియైయుండును. ఇక మొదట ప్రభుత్వోద్యోగులను వారలపక్షమునకు చెందినవారలను కారాగారములలో చేర్చిరి. ఇదే ౧౮వ తేదినాడు అల్మెరియనగరమువద్ద జరిగినయుద్ధములో విప్లవకారులు స్పెయినుప్రభుత్వమునకు చెందిన మూడువిమానములను ధ్వంసము చేయగా ప్రభుత్వమువారు విప్లవకారుల విమానములను రెండింటిని ఎట్లో ధ్వంసము చేసిరట. కాని మొత్తముపై విప్లవకారుల విమానబలమే ఎక్కువగనున్నట్లు ప్రభుత్వమువారే ప్రకటించుచున్నారు.

జనరల్ ఫ్రాంకో [విప్లవ సేనానాయకుడు] గారిఆజ్ఞచే ౨౧వ తేదినాడు మధ్యాహ్నము ఒంటిగంటకాగానే అన్నిరంగములనుండియు విప్లవసేనలు స్పెయిను ప్రధాననగరమగుమాడ్రిడుపై దాడిని ప్రారంభించెను. వారల విమానములు ముందుపోవుచు స్పెయినుప్రభుత్వము అత్మరక్షణార్థము చేయు ఏర్పాట్లనుపాడు చేయుచున్నది.

మార్గములో ప్రధాననగరమగు నవాలుకర్నెరో నగరమును ౨౧వ తేది మూడుగంటలవేళ స్వాధీనపరచుకొనిరి, కిమ్మట బిలోృ నగరముపై బాంబులువేసి పెక్కుమందిని చంపిరి. మలాగకుపోవు మార్గమందున్న ఎస్టపోనా నగరము ఇంకొకవైపు స్వాధీనమయ్యెను. మరొకవంక అరగానురాష్ట్రమున అను ప్రభుత్వవిమానములను పాడుచేసిరి, కార్డోవ నగరముపై బాంబులవర్షముకురిపించి పలువురిని చంపి, అనేకగృహములనుకూల్చగా స్పెయినుప్రభుత్వమువారు ప్రతిక్రియగా తమవద్దనున్న విప్లవ ఖైదీలనందరిని చంపివేసిరి. ఇట్టిక్రూర ప్రతిక్రియలుజరుగకుండ ఇరుపక్షములవారును ఖైదీలను మార్చుకొనునట్లు చేయుటకు బ్రిటిషుప్రభుత్వ విదేశాంగమంత్రి యత్నించుచున్నాడట. ఈయత్నము యుద్ధోద్రేకములో ఎక్కడపాగును?

అక్టోబరు ౨౨వ తేదినాటికి. మాడ్రిడుచుట్టను వలయాకారముగ విప్లవసేనలు చేరుకొనెను; ఒక్క ఎస్కోరియానగరమువద్ద మాత్రమే ప్రభుత్వసేనలు ప్రతిఘటించుచుండెను.

### మాడ్రిడు సంరక్షణము

నవాల్ కార్నెరో నగరపతనము మాడ్రెడువాసులను విభ్రాంతులజేసినది. అందుచే ప్రజలు మరింతపట్టుదలతో శత్రువుల నెదుర్కొనుటకు సిద్ధపడుచుండిరి. స్త్రీలు వీధులన్నియు ఊరేగుచు పురుషులలో యుద్ధోత్సాహమును పురికొల్పుటయేగాక, ౨౨వ తేదినాడు ప్రధానమంత్రి కార్యాలయమునకువెళ్లి నగరవాసులందరిని నిర్బంధముగ సేనతో చేరవలసినదిగ ఆజ్ఞప్రసాదించవలయునని కోరిరి. మాడ్రెడు నగరముచుట్టును రెండు సేనావలయములు కాపాడుచున్నవి. పశమటివైపున వేయిమందిసంరక్షించుచున్నారు. మాడ్రెడు ప్రభుత్వవశమున ౧౦ వేలమంది ఖైదీలు స్త్రీపురుషులేగాక శిశువులును ఉన్నారు. వీరినిశిచెడమండ కాపాడుటకై యత్నించుచున్న రెడ్ క్రాస్ సంఘములకు బ్రిటను తోడ్పడుచున్నది.

### అల్ప విశ్రాంతి

౨౩వ తేదినాడు మాడ్రిడుపై శత్రు విమానములుతిరిగి నగరము వెలుపల కొన్ని బాంబులను వదలి బెదరించెను. మాడ్రిడుకు ౧౨మైళ్ల దూరాన మొస్టొలెసువద్దనున్న ప్రభుత్వసేనలను ఛేదించి, ౨౪వ తేదినాడు విశ్రాంతిగైకొనిరి.

ఇక ౨౬వ తేదినాటి వార్తలు నానాతీరులనున్నవి; మాడ్రిడి ప్రభుత్వమువారు బాంబుల ప్రయోగముచే మాడ్రిడుముందు మాడుపట్టెలను వశపరచుకొంటిమన్నారు. ఆల్గోకాకూడ వశమైనదన్నారు. ఇతరప్రాంతములలోకూడ చిన్న విజయములు కలిగినవనిరి. క్యాటలోనియాసేనలు టార్డినియాకు, అల్యూబియరుకు, సారగోసాకుమధ్య రాళ్లపాకలను కట్టివేయుటకు అనువైన ఓగాఅడ్రెనును ఆక్రమించినట్లును టార్డినియా ఎదిరించిన శత్రుసేనల తరుమగొట్టినట్లునుకూడ చెప్పుచున్నారు.

శత్రువులు మార్బినావద్ద బాస్క్యూసేనాదళము తమనెదిరించగా తాము ౨౦౦ మందిని చంపి ఓడించినట్లును, తమ రెండవ యుద్ధనౌకలు బిస్కేజలసంధిలో తిరుగుచు ప్రభుత్వసేనలు సముద్రమువైపు రాకుండ చేయుచున్నట్లును చెప్పుచున్నారు.

ఒకరేడియోవార్త నవాల్ కార్నెరోమీదను, అలూసియామీదను ప్రభుత్వసేనలు దాడిచేయగా తిరుగగొట్టబడెననియు, ఆసేనావద్ద ౩౦౦ ప్రభుత్వసేనాదళములు చంపబడెననియు తెల్పుచున్నది.

జనరలు డీలానోగారు బ్రాడ్ కాస్టు చేయుచు స్పెయినుజనులకు తమతో చేరమనుచు; ఇంతవరకు ప్రభుత్వపక్షమున ౨౦౦౦౦ మందిచచ్చిరని, ౫౦౦౦౦మంది గాయపడిరని ప్రకటించిరి

---

### సిక్కులకు—మహమ్మదీయులకుపోరాటము

లాహోరు; అక్టోబరు ౨౧:—

లాహోరుజిల్లాలోని షహరాయ మొగలు గ్రామములో సిక్కులు—మహమ్మదీయులు మనఃస్పర్థలుగలిగి కొట్లాడుటచే ఇద్దరుమహమ్మదీయులు, ఒకసిక్కు మరణించిరి. ఆరుగురికి గాయములుతగిలినవి; వీరు కత్తులతో ఆత్మహత్యగావించుకొనిరి.

---

## రైల్వేఫ్రెయిటుపై సుంకము వసూలుచేయరాదు

సుంకపు శాఖకు రైల్వే శాఖనుండి ఉత్తరప్రత్యుత్తరాలు

(స్వ. వి.)

హైదరాబాద్ (దక్కన్): ౨౯-౧౦-౧౯౩౬.

ఇపుడు రైల్వేవారలు సరకుల రవాణాకై వసూలుచేయు చార్జి [ఫ్రెయిటు]పై సుంకపుశాఖవారు సరకుల విలువనుబట్టి వసూలు చేయు సుంకము గాక మరల రైల్వే ఫ్రెయిటుపైకూడ సుంకము వసూలు చేయుటవల్ల సరకులరవాణా తగ్గుచు రైల్వేవారికి రావలసినలాభమెంతయో పోవుచున్నది. అందుచే అట్లు రైల్వేఫ్రెయిటుపై సుంకము వసూలుచేయరాదని రైల్వేశాఖవారు సుంకపుశాఖవారిని ఇదివరలో కోరియుండిరి. సుంకపు పన్ను ఎక్కువ రావలసినచో సుంకపురేట్లను హెచ్చించుకొందుగాని రైల్వేఫ్రెయిటుపై సుంకము వసూలు చేయరాదనిరి. దీనిపైచర్య ఇంతవరకును గైకొనబడనందున మరల రైల్వేశాఖవారు ఈవిషయమై సుంకపుశాఖవారిని హెచ్చరించుచున్నట్లు తెలియుచున్నది.

---

## శిశు వైద్యశాల— ప్రభువుగారి ఫర్మాను

మ.ఘు.వ. నిజాం ప్రభువుగారి శిశురోగముల చికిత్సకై హైదరాబాదులో ఒక ప్రత్యేక వైద్యశాల అవసరమనియు, దాని ఖర్చులకై ద్రవ్యమును మంజూరు చేయవలెననియు ఒక ఫర్మాను దయచేసినట్లు తెలియుచున్నది.

# హిందూ మహాసభ

## అధ్యక్షోపన్యాసము

**అస్పృశ్యత యనునది మనలోనుండుట అనర్థము, అనేకఋషుల జ్ఞానసారమే హిందూమతము, హిందీ లేక హిందుస్థానీ వ్యావహారిక భాషగా నుండవలెను**

లాహోరు అక్టోబరు ౨౧

లాహోరులో జరిగిన హిందూ మహాసభలో అధ్యక్షుడగు శ్రీ జగద్గురు డా॥ కుర్తకోటి శంకరాచార్యులవారు ఒనర్చినట్టున్నది తమ ఉపన్యాససారాంశము.

"నేనుఒక పీఠాధిపతిని, సాధారణముగా పీఠాధిపతులు నిరంకుశాధికారులుగా నుండి పూర్వాచార పరాయణులై, అన్నిమతములను సమానమైన సమత్వయోగమునకు విముఖులుగా నుందురు. వీరు వివాదములను, కలహములను కూడా పెట్టుచుందురు నేనుకూడా పీఠాధిపతినైయును నన్ను అధ్యక్షునిగా నెన్నుకొన్నందులకు నేనుకృతజ్ఞుడను. పవిత్ర హిందూమతముయొక్క ఘనతనునిలుపుటకును, హిందువులందరిని యేకముచేసి హిందూమతములో చీలికలు, కలతనులేకుండ చేయుటకును, హిందూ మహాసభలో కలుగుచున్నదని భేదములనన్నింటినితొలగించి సంఘము ఒకీయము చేయుటకును నాచేతనైనందంతయు చేయగలను.

### హిందూమతము

నేనుబౌద్ధులలో బౌద్ధునిగను, జైనులలో జైనునిగను, బ్రహ్మమత వలంబులలో బ్రహ్మమతావలంబుడుగను, ఆర్యసమాజకులలో ఆర్యుడుగను, సిక్కులలో సిక్కునిగను, నిమ్న జాతులలో నిమ్నజాతివాడుగను నేనుందును. ఈ నావైఖరి శ్రీశంకరుని అద్వైత సిద్ధాంతముయొక్క సారమేకాని అన్యయముకాదు. శంకరాచార్యుని గురువర్యులగు శ్రీగౌడపాదాచార్యులవారు. "స్వసిద్ధాంత వ్యవస్థాసు ద్వైతినో నిశ్చితాదృఢం. పరస్పరం విరుధ్యంతే తైరయం నవిరుధ్యతే." [తమసిద్ధాంతములను స్థాపించుకొనుటకు ద్వైతులు పరస్పరము కలహించుచుందురు. కాని ఈఅద్వైతము ఎవ్వరికినివిరుద్ధముకాదు.] ఒకసంఘము యితరసంఘములను బలవంతపెట్టి హక్కులనుసంపాదించుటకు తమకు ఐక్యములభించదు. ప్రతిమతమువారు తమ సంఘములను వృద్ధిచేసుకొని ఇతరసంఘములతోనప్పుడి వారితో సమానముగా నిలువవలెను.

అధ్యవిజ్ఞానరక్షణము, వ్యాపనము ఇతరమతములకు ఎన్నటికిని ప్రతికూలముగా నుండజాలదు. ఇతరమతములవారికంటె మనఋషులు నిత్యజ్ఞానమును, సచ్చిదానందమును ఎక్కువగా సంపాదించిరి. హిందూధర్మ మన్ని అవస్థలకుపనికివచ్చును. హిందూమతమునకు కర్త ఒక్కడు లేడు. అనేక ఋషుల జ్ఞానరసమే హిందూమతము అభివృద్ధికవకాశమొసంగుచున్నది. ఇతరమతములవారు ఈవిషయము తెలియక విగహారాధిన వలదనుచున్నారు. భగవంతుడు నామ, రూపరహితుడైనను దైనిక కార్యములకుగాను ఆతనికొకరూపమిచ్చి ఆరాధించుట సమంజసమేకదా! మహమ్మదీయులు మసీదులలో, క్రైస్తవులు చర్చిలలోను ప్రార్థించుటలేదా?

మసీదులయెదుట మేళములు చేయరాదని ఖురాను ఆదేశించుచున్నచో ఆయాదేశము మహమ్మదీయులకే వర్తించును గాని ఇతరులకేలు వర్తించును? "లోకాస్సమస్తా సుఖినోభవంతు" అను మనకోరిక ఇతర మతములవారు గ్రహించువారో మశీదులసేరిట నింత రక్తపాతము జరుగదు. భారతదేశమునందలి యితర మతములవారు మనతో స్నేహభావమున నుండిననేగాని సంపూర్ణస్వాతంత్ర్యము సాధింపసాధ్యమగును. హిందూస్థానము హిందువులదేయనియు ఆర్యవిజ్ఞానమును, హిందూధర్మమును రక్షించుటకే హిందువులుజీవించుటయనియు మనము వారికి తెలుపవలెను.

ఈమాటలు మైనారిటీలవారికి దురభిప్రాయములు కలుగచేయునని నేనుతలుస్తాను. మైనారిటీలవారివిజ్ఞాన, మతస్వాతంత్ర్యము పూర్తిగాయుండును, సాంఘికమతములద్వారా రాజకీయాధికారములను పొందుటకు మైనారిటీసంఘమువారు ప్రయత్నించుచున్నారు. హిందూస్థానముయొక్క మతము జాతిని భాష హిందుస్థలదేయై యుండవలెను. ఈ సూత్రమును రాజ్యాంగవిధానమునకు ఆధారముగాగొని సంయుక్తనియోజకవర్గములద్వారా ఎన్నికలు జరుపవలెను. ఇదిహిందూధర్మానుసారముగా నుండును. ఐనను, మైనారిటీలకు రక్షణయవసరమైనచో నానాజాతిసమితివారు మైనారిటీలను కేర్పరిచినరక్షణలను. గ్యారంటీలను మనదేశములో కూడా అమలుపరుపవచ్చును.

### నానాజాతి సమితివారి స్కీము

మతముజాతి, భాషలలో మహమ్మదీయులకు గ్యారంటీలుండునట్లు మనము చూడవలెను. నానాజాతివారి స్కీమునుసరించి దేశములోని మేజారిటీసంఘముయొక్క జాతి,మతము,దేశభాష,మతము, జాతిగానుండును. పంజాబు, బెంగాలు రాష్ట్రములలో హిందువులు మైనారిటీలోనున్నను దేశముయొక్క మతము, భాష, జాతి హిందువులదే.

### అస్పృశ్యత

మనలో కొన్నిదురాచారముల తొలగించినగాని మనసంఘమునకు బలము, చైతన్యముకలుగును. దురాచారములన్నిటిని వివరింపవ్యవధి చాలక అస్పృశ్యతవిషయముమాత్రము ప్రస్తావింతును.

అస్పృశ్యతయనునది మనలోనుండుట అనర్థము. అస్పృశ్యత శాస్త్రసమ్మతమని వాదించుట పిలుగానిపని, భూతదయకది కేవలము విరుద్ధము. సాధ్యమైనంతత్వరలో మనముతొలగింపవలెను. మహాభారతము, శ్రీశంకరాచార్యుల గీతాభాష్యమునందలి "కారణార్థ మన్విచ్ఛేత్" [ధర్మము కారణముపై నాధారపడి యుండవలెను.] అనుదానియర్థమును గ్రహింపక అస్పృశ్యతను గ్రుడ్డిగాపాటించుచున్నారు.

హరిజనులు యొవరిమతమును స్వీకరించవలెనని కోరుచున్న డా. అంబేడ్కర్ గారిని ప్రజలు దూషించుచున్నారు. కాని ఆయన మనలమేల్కొల్పెను. మనలనుప్రబోధించెను. అస్పృశ్యులుపడుచున్న అవమానములు, కలుషములు వారికితెలిపెను, మనము కృతజ్ఞత తెలుపవలెను, క్రైస్తవులయొక్కయు, మహమ్మదీయులయొక్కయు ప్రయత్నములవలన మనఅస్పృశ్యులు ఆయామతములలో చేరుటకంటె సిక్కుమతములో చేరుటమంచిది. అనగా ఒక్కనెట్టున సిక్కుమతము అవలంభింపవలెనని కొందరు హిందూసంఘములోనుండుట తమకు అవమానకరమని తలచుహరిజనులు సిక్కుమతములో చేరవచ్చును.

నాసికలోజరిగిన దేవాలయసత్యాగ్రహములో డా॥ అంబేడ్కర్ గారును వారిఅనుచరులును సనాతనహిందువులతో. పోరాడుచున్న కాలమును సిక్కుమతములో చేరుటయందు ఉపయోగించవలెనని నేనుచెప్పితిని.

సిక్కుమతములో చేరుట అన్యమతములో చేరుటకాదు. సిక్కులుకూడా హిందువులే. వారు హిందువులలో క్షత్రియులవంటివారు. పూర్వము గుణకర్మవిభాగమునకై వర్ణమేర్పడెననియు, ఒకరుగొప్ప, ఒకరుతక్కువయని భావములేకుండెననియు సంస్కరణలు చేయుచున్నందున వీరికికూడా తావొసంగవలెను. హిందూమతములో నాస్తికునకుకూడా తావుకలదు.

హిందూమతములో పుట్టినవాడే హిందువని ఒకఅభిప్రాయము ప్రజలియుండుటచే అవరకముకలుగుచున్నది. మనఆర్యులు అనాగరికజాతులను తమలోకలుపుకొనిరి. కావున ఇతరమతములవారికిని, జాతులవారికిని మనము తమలో చేరుటకు అవకాశమివ్వవలెను. ఇతరదేశములయందలిహిందువుల క్షేమమును కనిపెట్టుచుండవలెను. ఇదియునుగాక హిందూమత ధర్మములను ఇతరదేశములలో వ్యాపింపజేయుటకు ఏర్పాటులుచేయవలెను.

### భాష

దేశముయొక్క విజ్ఞానము భాషద్వారావెల్లడియగును. గాన హిందీభాషా సంస్కరముచే సంకరముగానుండ చూడవలెను. హిందీలేకహిందుస్థానీ వ్యావహారికభాషగా నుండవలెను.

### కాంగ్రెసుకు మనకుగలసంబంధములు

కాంగ్రెసులో అన్నిసంఘములవారు నున్నారు. గనుకవారి సాంఘికవిషయములలో జోక్యముకలిగించు కొనవీలులేదు. సాంఘికనిర్ణయమువిషయమై కాంగ్రెసువారు తప్పుచేసిదిద్దుకొనిరి. ప్రత్యేకముగా కాంగ్రెసుహిందువులహక్కులను రక్షింపజాలదు. కనుక మనసంస్థ హిందూహక్కులను రక్షింపవలెను. వీలైనప్పుడు మనసభ్యులు కాంగ్రెసుతోకలిసి పనిచేయవలెను.

## హిందూమహాసభాధ్యక్షుని ఉపసంహరణం

లాహోరు, అక్టోబరు ౨౩:—

హిందూమహాసభాధ్యక్షుడగు డా॥ కుర్తకోట శంకరాచార్యులవారు ఒకప్రకటన గావించుచు ఇట్లుతెలిపిరి:—

"నేను హిందూమహాసభ ప్రారంభోపన్యాసములో ఉపయోగించినవాక్యములు పంజాబు సనాతనులు సరిగాఅర్థము చేసుకొనినందున వారికి మనోవ్యథకలిగించెనని విని మిక్కిలి చింతకలిగినది. వారికికలిగిన మనోవ్యధబాపుటకును, శాంతి ఐకమత్యము కాపాడుకొనుటకు గాను నేనుఆవాక్యములను ఉపసంహరించుకొనుటకు వెనుతీయను. కనుక ఆవాక్యములు ఉపన్యాసమునుండి తీసివేసినటుల భావించవలెను.

ఈఉపసంహారణకు శ్రీయుత జగుల్ కిషోర్ బిర్లా, పర్ గోకులచందనరాంగ్, సేట్ రామకృష్ణలాల్ యా డా॥ సౌయిటకా గారలు ఆ ఉపన్యాసమునుండి గావించుచున్న ప్రయత్నమేకారణ ... ఈప్రకటనగావింపబడినది.

మహాసభకుపూర్వమే సనాతనులు తమల క్షేపణలను తెలిపి తీసివేయవలెనని కోరినప్పుడు శ్రీఅధ్యక్షులవారు, "నిశ్చితాభిప్రాయము అనుచెప్పసంతదాచుకొనుటగేడే తమకిష్టమని" చెప్పిరికదా! అప్పుడుదల ఇప్పుడేలనశించె? ఈ అభిప్రాయమప్పుడేల కలుగదాయె?

---

తమ యభివృద్ధికి హిందువులు స్వయంసహాయముమీదనే ఆధారపడవలెనేగాని అన్యులసహాయమునపేక్షింపరాదు. మనదేశముయొక్క గొప్పతనమును, మనవిజ్ఞానమును వృద్ధిచేసిప్రపంచములో వ్యాపించునట్లు చేయవలెను. హిందువులు ఉన్నతస్థితిలోనున్నచో. తమస్థితిగూడ ఉన్నతముగా నుండునని దేశములోని యితరమతములవారు తలంపవలెను.

(ఆంధ్ర)

# ఆంధ్ర వార్తలు

## పుదుక్కోటలో ఆంధ్రులకు ప్రత్యేకాంధ్ర పాఠశాల

ఆంధ్రరాయబారుల సూచనకు ప్రభుత్వము సుముఖమగుట

పుదుకోట అక్టోబరు ౨౫ —

దక్షిణ భారత గ్రంథాలయ మహాసభ, పుదుక్కోట సంస్థాన గ్రంథాలయ మహాసభల సందర్భమున ఈనగరమునకు విచ్చేసిన మ-రా-శ్రీ వేమవరపు రామదాసు పంతులు, దాసు త్రివిక్రమరావు డాక్టరు బి నారాయణస్వామి అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగార్లకు నిన్న పుదుక్కోట ఆంధ్రులు స్వాగతపత్రము సమర్పించిరి అందు ప్రస్తుతపు పుదుక్కోట సంస్థాన ప్రతిష్ఠాపనమునకు ఏవిధముగ ప్రముఖులగు ఆంధ్రులు బ్రహ్మేంద్ర స్వాములవారు తోడ్పడినదియు సవిస్తరముగ ప్రస్తావించిరి ఆంధ్రులకొక సంఘముగూడ అవశ్యకమని తెలియజేసిరి

ప్రత్యుత్తరమిచ్చుచు త్రివిక్రమరావుగారుత్వరలో కేంద్రసంఘము నొకదానిని పుదుక్కోటలో స్థాపించి, ఇతరపట్నములలో యుపశాఖలను నెలకొల్పి సాంఘిక జీవనమునకు ఐక్యత కల్పించవలెనని గోరిరి. ఆంధ్రభాషను, ఆంధ్ర సాంప్రదాయములను మరువవలదని యుద్బోధించిరి.

తరువాతరోజున డాక్టరు శఠగోపం నాయుడుగారి గృహమున టీపార్టీలో టి. రావుగారు "ఆంధ్రప్రతిభ"ను గురించి ఉపన్యాసము గావించిరి. తదుపరి వేంకటరమణయ్యగారు ఆధుని కాంధ్రజీవనముగురించి ఉపన్యసించిరి. వెంటనే పుదుక్కోట ఆంధ్రసంఘము నెలకొల్పబడెను. కృష్ణస్వామి నాయుడుగారు అధ్యక్షులుగను సేటుమ్యూజియం క్యూరేటరు రంగరాజాగారు ఉపాధ్యక్షులుగను ఎన్నుకొనబడిరి. ఆంధ్రపుస్తకాలయముగూడ స్థాపింపబడెను. ఆంధ్రులందరు ఉత్సాహపూరితులై ఆంధ్రభాషను శ్రద్ధతోనభ్యసించుటకు దీక్షవహించిరి.

నాటిమధ్యాహ్నము డీ.టి.రావు, వేంకటరమణయ్యగారలు అడ్మినిస్ట్రేటరు సర్ అలెగ్జాండరు టాటెన్హాంగారి దర్శనమొనరించి గ్రంథాలయోద్ధారణగురించి ముచ్చటించుటయేగాక సంస్థానాంధ్రులకు ప్రత్యేక ఆంధ్రపాఠశాలా సౌకర్యముండవలెనని నివేదించిరి. అడ్మినిస్ట్రేటరుగారుత్వరలోనే అట్టిపాఠశాలను సంస్థానాంధ్రులు కోరినచో ఏర్పాటుచేసెదమని సెలవిచ్చిరి.

డి.టి.రావుగారు, వేంకటరమణయ్యగారలు సంస్థానపర్యటనము గావించి ముఖ్యపట్నములలోని గ్రంథాలయములను పరీక్షించి, వేర్వేరు గ్రామములలోని ఆంధ్రులతో సంప్రదించి బెజవాడకు పయనమైరి.

### జవహర్లాలుగారి రెండవ ఆగమనము

ఎన్నికల సందర్భమున కొంతమంది కాంగ్రెసు నాయకులవలని తెలియుచున్నది

కాంగ్రెసు మహాసభాధ్యక్షుడగు పండిత జవహర్లాల్ నెహ్రూగారు నవంబరు ౫ తారీఖున కలకత్తావచ్చి కొన్నాళ్ళు బెంగాలురాష్ట్రములో పర్యటనము గావించెదరు తరువాత యునఒరిస్సా, ఆంధ్రరాష్ట్రములలో సంచారము గావించును

### చెన్నపురి ఆంధ్రమహాసభ దసర సమావేశము

చెన్నపురి ఆంధ్ర మహాసభ దసరా ఉత్సవములు (౨౦-౧౯-౩౬ మంగళవారము) ప్రారంభమైనవి. ౨౧వ తేదీన సాయంకాలము ౪-౩౦ గంటలకు సభాభవనమందు ప్రారంభమైనది గౌ॥ సర్ కూర్మా వేంకటరెడ్డినాయుడుగారు సభకు అధ్యక్షత వహించిరి.

ఆంధ్రప్రముఖు లెందరో వచ్చియుండిరి.

చెన్నపురిలో ఆంధ్రమహాసభ స్థాపింపబడి చాలకాలమైనది. స్వంతభవనము ఏర్పడలేదు. దీనివిషయమై తగుశ్రద్ధ వహింపవలసినదని శ్రీమతి విద్యాసుందరి. బెంగుళూరు నాగరత్నమ్మగారు విన్నవించిరి.

ఆంధ్రులకు సంక్రాంతి దసరా పెద్దపండుగలు. ఇదిజాతీయ ఉత్సవమగుటచే ఆంధ్రులందరు ఒకచోట సమావేశమై, ఆంధ్రుల అభివృద్ధికి దైవప్రార్థన చేయుటే ఈసభయుద్దేశమనిసర్ రెడ్డినాయుడుగారు చెప్పిరి. ఆంధ్రులందరు ఏ ఏ పార్టీలకు చెందినవారైననుసరే తాము ఆంధ్రులమను సంగతిమరచి పోకూడదు. ఆంధ్రులందరు సఖ్యముతో మెలంగుచు. తమకు అందరకు అవసరమగు అభివృద్ధికి పాటుపడుటకై ఇట్టి ఉత్సవములు తోడ్పడును ఇట్టి ఉత్సవములలో ఆంధ్రులందరు ఒకచోట చేరుటకు అవకాశమేర్పడును. వీరిలో వీరికి ఎక్కువమైత్రి యేర్పడును. బలముఅధికమగును." అనిరి.

మదరాసులోని ఆంధ్రమహాసభవారి దసరా ఉత్సవములు ౨౦ వ తేదీన ప్రారంభమయినవి. ౨౧ తేదీన శ్రీ పిఠాపురం మహారాజాగారి ఆతిథ్యమునను, ౨౨ వ తేదీన శ్రీ బొబ్బిలిరాజాగారి అతిథ్యమునను విందులు జరిగెను

చెన్నపురి ఆంధ్ర మహాసభయందు దసరా ఉత్సవముల సందర్భము అక్టోబరు ౨౩వ తేదీన జయపురం మహారాజాగారి అతిథ్యమువిందు జరిగెను శ్రీగద్దెరంగయ్యనాయుడు సభాధ్యక్షత వహించిరి

౨౪వ తేదీన శ్రీదేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారి ఆధిపత్యమున విందు జరిగినపిదప సభకు వి రామదాసు పంతులుగారు అధ్యక్షత వహించిరి సభానంతరము సభ్యుల నాట్యబృందమువారు బాగుగను, ఫార్సు రమ్యముగ ప్రదర్శించిరి, డి.డి. రాధాకృష్ణయ్యనాయుడుగారు బాలురకు మిఠాయి పంచి పెట్టిరి

## ఆంధ్ర రాష్ట్ర హరిజన సేవకుల సమావేశము

ఏలూరు, అక్టోబరు ౧౯

నిన్న మధ్యాహ్నము ౧ గంటకు ఆంధ్రరాష్ట్ర హరిజన సేవకసంఘ కార్యాలయమున జిల్లా హరిజన సేవక సంఘముల కార్యదర్శుల యొక్కయు, ఇతర హరిజన సేవకులయొక్కయు సమావేశము జరిగెను.

శ్రీయుత కక్కెరగారు ముందుగా అఖిల భారత హరిజనసేవక సంఘ కార్యనిర్వాహక సంఘమువారు ఇటీవల సమావేశమై, ఆంధ్రరాష్ట్ర హరిజన సేవకసంఘమునకు, ప్రస్తుతము ఖర్చునూటికి ౫౦ వంతు చొప్పున ఇవ్వబడుచున్న గ్రాంటునూ, నూటికి 33 వంతునకు తగ్గించుటకు నిర్ణయించిరనియూ, అందువలన జిల్లాసంఘమువారందరూ, నూటికి ౬౭ రూ. స్థానికంగ వసూలు చేసికొనవలసి యుండునని యూ తెల్పిరి.

చర్చయైనతరువాత సమావేశము వారీక్రింది తీర్మానము గావించిరి "ఈసమావేశమువారు కేంద్రసంఘమువారు నూటికి ౫౦ వంతున వచ్చే ఏ.పిలు నెలవరకూ గ్రాంటు ఇవ్వవలయుననియూ, వారి నిర్ణయముప్రకారము గ్రాంటుకు ౧౦౦ కి 33 వంతున తగ్గింపరాదనియూ, ఈసరతుపై జిల్లా సంఘములవారు, తమ పూజానిధిద్రవ్య మైపోయినప్పటికిగూడ ఈసంవత్సరము ప్రారంభించినపని పూర్తి చేయుటకు నిశ్చయించినారు."

(ఆంధ్ర)

## చెన్నపురి కార్పొరేషను ఎన్నికలలో కాంగ్రెసు విజయము

మద్రాసు ౨౭ అక్టోబరు

చెన్నపురి నగరమున నేర్పరుపబడిన రండి విజనులలో ౩౬ డివిజనులందు నిన్నటిదినమున కార్పొరేషను నకు జరిగిన యెన్నికల ఫలితము నేడు ప్రకటింపబడెను. మిగిలిన వానింటిలో మూడు డివిజనులలో కాంగ్రెసు అభ్యర్థులును, ఒక డివిజనులలో జస్టిసుపక్ష అభ్యర్థియును పోటీలేకయే యెన్నుకొనబడిరి.

శ్రీమతి రుక్మిణమ్మగారు

మిగిలిన ౩౬-లోను ౩౫ డివిజనులందు కాంగ్రెసువారు పోటీచేసి ౨౭ స్థానములను గెల్చిరి జస్టిసుపక్షమువారు వీనిలో ౧౭ స్థానములకు పోటీచేసి ౬ స్థానములను గెల్చిరి. యేపక్షమునకు చెందని స్వతంత్రసభ్యులు ౬ స్థానములను గెల్చిరి. కాంగ్రెసువారు పోటీచేయకవదలిన ఒక డివిజనునందు జస్టిసు అభ్యర్థి నెగ్గెను.

ఇవిగాక మూడు నిమ్నజాతుల స్థానములకును రెండు కార్మికస్థానములకును గూడ ఎన్నికలు జరిగెను. నిమ్నజాతుల స్థానములకు పోటీ కొభ్యర్థులులేరు. కార్మికస్థానముల రెండిటికిని కాంగ్రెసువారు పోటీచేసిరి. ఒకస్థానము కాంగ్రెసునకువచ్చెను.

ఈయెన్నికలలో, ఎక్కువ తీవ్రమగు పోటీ జరిగిన పుదుప్పేట డివిజనునందు కాంగ్రెసు అభ్యర్థియగు శ్రీమతి రుక్మిణమ్మగారు, జస్టిసుపక్ష నాయకుడగు టి. సుందరరావు నాయుడిగారి నోడించెను. ఇంతియగాక, కాంగ్రెసువారు అభ్యర్థులుగనిలిపిన శ్రీమతిఅమ్మాస్వామినాథన్ శ్రీమతి విశాలాక్షమ్మగార్లు ప్రత్యర్థులనోడించి విజయమందిరి.

నేడు ఉదయమునుండియు నగరమున ముసురుపట్టి వర్షించుచున్నను, వేలకొలది ప్రజలు ఉదయమునుండి రిప్పనుభవనమున పరిసరములందు వర్షములో తడియుచునే కాంగ్రెసు అభ్యర్థులవిషయమున జయజయ ధ్వానములతో నాహ్వానించుచుండిరి.

### శ్రీమతి రుక్మిణమ్మగారిని కత్తితో బెదరించుట

మొన్న ౨౫ వ తేదీన నగరమునందంతటను కాంగ్రెసువారు చాల ఊరేగింపులు జరిపిరి. కొంతమంది కాంగ్రెసువర్కరులు శ్రీమతి రుక్మిణమ్మగారి యింటివద్దనుండి కారులో బయలుదేరిరి. ఆకారు పాంథియనురోడ్డు పైపు వెళ్లుచు ఎగ్మూరు పోలీసుకోర్టుఎదుటకు రాగానే కారుమీద చాలరాళ్లుపడినవి. కొందరులాటీలను పట్టుకొని అడ్డముగానిలిచి కారునునిలిపివేసి కారులోనున్నవారిని పట్టుకొనిరి ముగ్గురికి దెబ్బలుతగిలినవి. వారుకారునచటవదలివేసి వెళ్లిపోయిరి. ఈ అల్లరియేమిటోఅని తెలుసుకొనుటకు శ్రీమతి రుక్మిణమ్మగారచటికి రాగా గుంపులోనొకడు కత్తివలెనున్న ఒకఆయుధమును పైకెత్తి ఆమెను బెదరించెను ఆమెతనయింటికి వెళ్లిపోయెను. దెబ్బనుతగిలినవారు పోలీసువారికి తెలియజేసిరి. వారికి జనరలు హాస్పిటలులో చికిత్సచేయబడెను. కారుకుచాల నష్టముకలిగెను.

### వోటరుల సంఖ్య

మదరాసులో జనరలు సీట్ల వోటర్లసంఖ్య ౯౨౭౬౮, కార్మికవోటర్ల సంఖ్య ౧౮౪౧౭. చాలమంది వోటరులు నడచివెళ్లియే వోటు చేసిరిగాని కారులకొరకు నిరీక్షించలేదు.

—ఆంధ్ర

## శ్రీ.కా. నాగేశ్వరరావు పంతులుగారి ఛాయాచిత్రప్రతిష్ఠాపన

నెహ్రూ పండితునిచే జరుపబడుట

౨౦ వ తేది మంగళవారము సాయంత్రము ౫ గంటలకు బెజవాడ శ్రీరామమోహన గ్రంథాలయమందు పండిత జవహరిలాల్ నెహ్రూగారు శ్రీ. కాశీనాథుని నాగేశ్వర రావు పంతులుగారి ఛాయాచిత్రమును ప్రతిష్ఠించిరి.

నెహ్రూగారిట్లు మాట్లాడిరి. "సజీవులుగా ఉన్నవారి చిత్రపటములు ప్రతిష్ఠించడమంటే చాలాచిక్కు అయినవిషయం. ఎందుచేతనంటే ఇలాంటిసభల్లో వారినిగురించి అతిశయంగా పొగడటంగాని, లేక చెప్పవలసినంతకూడ చెప్పకపోవటంగాని కలుగుతుంటుంది. అది న్యాయంలేదు. అదీకాకుండా, జాతీయరంగంలో మాతోబాటు పాటుబడుతున్న మిత్రునిగురించి మాట్లాడమంటే మరీ సంకటంగా వుంటుంది. వినా ఈ చిత్రపటాన్ని ప్రతిష్ఠించటం నాకుసంతోషంతో కూడినది. ఈ పటం ఇచ్చట ప్రదర్శింపబడటంవల్ల అందు రూపింపబడిన ఉత్తమవ్యక్తియొక్క సద్గుణాల నన్నిటిని ఇతరులు ఆదర్శంగా పెట్టుకొని వృద్ధి పొందుతారని ఆశిస్తున్నాను" అనిరి.

